అయ్యో! యీయనవాహనమున కీయాకస్మికసంభ్రమ మేమి చెప్పుమా? ఆ! తెలిసినది.

ఉ. మాత! జొహా ర్జొహా ర్మహిషమర్దని! నీ కని మ్రొక్కెద దేవసం
ఘాతము వాక్ప్రయంబు భయకంపిత మాచును నాలకించి, తక్
దూతలు ముట్టుకొన్న జనధూతవిషాణభయానకంబుగాఁ
బోతు ప్రధావనంబు సలుపున్ వలవంకకు ఘంట మ్రోఁగఁగన్ 17

(అన్యత్ర చూపుఁ బఱపి భయముతో)

చ. వికటపుమోముఁ, గ్రొమ్మెఱుఁగువెండ్రుకలున్, నరమండమాల, తా
ళికుటమహాభుజంబులు, జ్వలన్నయనంబు లగోన్నతంబు మే
చకఘనకాయముం గలిగి సర్వభయంకరుఁ డౌచు విన్కనిన్,
వికృతముగా నభోంగణము నిండి కనంబడు నీతఁ డెవ్వఁడో, 18

(విమర్శించి) ఇతఁడు దిక్పాలపంక్తినివిష్టుఁ డని వినంబడు రక్షఃపతి నిరృతి యని తలం
చెదను. (నవ్వి) ఆహా! యీతనియుం దంబికాపరివారవర్గమున కెంతసా
హాచర్యము!

తే. గీ. వేసఁ బ్రత్యగ్గమింతురు, కౌఁగిలింత్రు । స్వాగతంబుల నడుగుదు రవసరంబు
నుచితము వచింత్రు, నిరృతిరా, యిచట నున్న। ప్రమథులెల్లను నిండారుప్రమదమునను.

(స్పర్శసుఖమనుభవించి) ఏమిది? నాయంగము చల్లనిమడుఁగులో మునిఁగినట్లు లా
హ్లాద మొందుచున్నది! (చూచి)

తే. గీ. హారకుండలధరుఁడు రమ్యాననుండు । నగుచుఁ గనుఁగవ వసరయించు నంబుభర్త.
విమలతారకపూర్ణేందుబింబయుక్త । మైనగగనావకాశంబునంపమునను. 20

ఓహో; యీతని తేజ మితరతేజఃపరిభావకము.

క. వరుణుని తేజం బన్నము । హరియించె నటన్న నేమి యచ్చెర వీతం
డిరవుకొనుకడను జేరిన । తరుణము నెసపొనుఁగుపడుఁ గదా వెనుజోతుల్. 21

(మఱియొకరియెడఁ జూచి తావి నరసి) సకలేంద్రియసంతర్పణం బయినపరిమళంబునఁ
బ్రపంచము ముంచివేయుచున్నాఁ డీతఁ డెవఁడో? (బాగుగఁ జూచి)

చ. అనలుఁడు మిత్రవంతుఁ డగు, నన్నము పాముల కబ్బ, నాసిప్రపు
చ్చును భువనం బనూన మగు శూలిశరీర మెనందు గల్గ, మూ
ర్ధనమనసంచలత్కుసుమదామగళన్మకరందలుబ్ధభృం
గనినదయుగానబంధురుఁడుగా నలగంధవహుండు డగ్గఱున్. 22

(తలఁపు వచ్చినట్లుగా) నిత్యస్పర్శంబున నాహ్లాదము సేమోకాని యనిలాస్యదాయన

యౌత్సుక్యము నొందుచున్నది.

తే. గీ. మానసము హర్షపడు, స్వాత్మమతి జనించు
నితనియెడ నేమొకో యిది యే నెఱుంగ; (చిఱునవ్వుతో)
నైన సంగంబునను గేవలైక్యబుద్ధి
గలుగు సమనామములకుఁ బయస్సులకుఁ బోలె. 23

(అతికష్టముగా నన్యత్ర చూపు మరలించి) ఏకపింగళమయినకనుంగవతో సన్నిహితుం డయిన సముగ్రభూషణమణిప్రభాళకలితశార్వరాంధకారోన్మేషుఁ డీపురుషోత్తముఁ డెవ్వఁ డగునో? (తెలియుట నభినయించి)

చ. కలుములకాఁపుసంపుటలకాపురశాలికి సార్వభౌముఁడున్
విలసితనైజభూధరనివేశితశీతలపాదచారుఁడున్
లలితపుయక్షరాజ్యకమలాదిపులాపళి కంబువాహుఁ డౌ
నలఘునిశాధినాథమణి గ్రొల్లబిలుం డగునీతఁ డారయన్. 24

(సానునయహర్షంబుగా) ఆహా! నాభాగ్య మవాఙ్మనసగోచరము గదా!

మ. సజవోద్వేల్లలదోపహార్యవృషభస్పందానువృత్తిస్ఖల
న్నిజచూడోచ్చలితాదితేయతటినీనిర్హ్రాదుఁ డాహ్లాదకృ
ద్ద్విజరాజచ్ఛవి, తాను దృక్పథమునం దీపించుచున్నాఁడు పూ
ర్విజయుం డవ్వల దవ్వులం దొలఁగ దారిం దారునం దేవతల్. 25

ఉ. దేవర యిప్పు డొద్ద కరుదేరఁగ హర్షపరీతచిత్తనై
దేవియుఁ దల్పతలంబునను దిగ్గనఁ బయ్యెద జాఱ లేచి, కై
లా విడఁగా జయాసఖి, కెలంకున మిక్కిలి సంభ్రమంబునన్,
దా విభు డాయఁగాఁ గొనిపదంబు లిదే మెలమెల్ల నేగెడున్. 26

(మరలవిలోకించి) ఆహా! యిది యతిమనోహరముగా నున్నది.

క. సురసిద్ధసాధ్యవిద్యా। ధరకిన్నరసుందరులయుదారనయనభా
సురముఖముల నిండి దివం। బరు దగు బహుచంద్రమండలావృతిమట్లై. 27

నే నీబృందారకుల కందఱకు వందన మాచరించెదను.

తే. గీ. లగ్గు నొడగూర్ప నెగ్గుఁ దొలంగఁ బెట్టఁ
గలుగునింద్రాదిదిక్పాలకులకుఁ బ్రణతి;
యేతదఖిలామరశ్రేణి యెపుడుఁ గొలుచు
దేవి కీశైలరాజపుత్త్రికి జోహారు. 28

(నమస్కరించి లేచి పైకిఁ జూచి) అయ్యో! యాకాశము శూన్యమైనది.

తే. గీ. వేలుపులు లేరు; లేరు దిక్పాలురన్న । నసలు లేరు; విమానవర్గంబు లేదు;
కేవలంబును దొంటిభయానవహంపు । జిహ్మగతిఁ కటి శేషించెఁ గ్రమ్మఱంగ.

నిర్వర్తితకార్యాణిపన్నులయి గీర్వాణులు గమించి రని తలంచెదను. (హర్షముతో)

తే. గీ. వెనుకటి ఘనంబులందు నల్పినమదీయ
బహుతరోత్కృష్టతప మెల్లఁ బండె నేఁడు;
దేవతాసార్థమును దాను గేవలంబు
సాంబమూర్తియె నాకు సాక్షాత్కరించె. 30

(విమర్శించి) సర్వమంగళాచరణమూలోపసన్నమున కిదియే నా కనుకూలసమయము సమీపించెను. (పరిక్రమించుచు సపేక్షతో) అంబిక యనుగ్రహించునా?

క. ఉపచితఘనరాగుండై నే । నపారవిఘ్నాంధకారమునుఁ జించి కిటుకునన్
జపలాక్షి కృపగ్రహించుతు నా । తపమున్ దమ నన్నగనందినితానాదరవోలెన్. 31

(ముందుచూచి) ఇదె యుపవనద్వారము. నే నిందుఁ బ్రవేశించెదను. (ప్రవేశించి తొట్రుపాటు నభినయించి నిర్వేదముతో) ఇది నగ్నప్రదేశ మయినను నాయకుఁడు తొట్రుపడు చున్నదేమి కారణము? కానీ. ఇక్కడనే కూరుచుండి దేవిని బ్రసన్నురాలిం జేసికొనియెదను. (దోసిలిపట్టి)

ఉ. పంచలవాలుగా భిదురపాణి, కుబేరుఁడు పాలు భీరుఁడై,
కాంచఁగ నీళ్ళకోఁ డొంపలఁ గంపము, శూలియు మూలఁ దూఱ, వే
యంచులవాలుజోదు పాఱయం బలుబాములు, నైఁప కెన్మరా
త్రించరుమస్త మెత్తి అ మధించినదేవిపదంబు గొల్చెదన్. 32

(సశ్లాఘముగా నాకాశమున)

ఉ. శోడినయస్య యౌవిజయతో సరసోక్తుల నింక మానకే,
జోడుగ నొద్ద నున్న శశిచూడునిమోమును చూపుఁ ద్రిప్పకే,
పోఁడిగ నెత్తునంఘ్రిమణిభూషయు గల్లన మ్రోఁగ కుండఁ జెం
డాడితి వద్రిజా! మహిషు; నంబ! యి దేమి విలాసమో గదా. 33

(నిమిత్తమును సూచించి)

తే. గీ. ప్రియతమాలింగనము నీకు బెఱయ దింక
నకట! దక్షిణబాహువా! యదర దేల?

యొఱుఁగవే మల్లికానుట నైక హేతు
నైఁగ నగనోష్ఠకఠిన వాక్యంబు నీవు? 84

(నిశ్వసించి యాకాశమున)

తే. గీ. అయి నిర్వ్యాజకన్యకాకాంక్షచిత్త । పాపసుకృతుఁడ నగు నాకు నబ్బమి తగుఁ;
గాని త్వద్వాక్యమే కదా దాన మాల । మంబ! నీకరుణార్ద్రత కద్దిటు లె?

అయినను స్వకర్మాధీనసుఖదుఃఖుఁడ నయిన నేను భగవతి నీ కాత్యాయని నుపాలంభించెద నేల? ప్రియతమురాలు లభింపమిం జేసి నాజీవితము నిష్ఫలము గావున స్వీయముపహారంబు లయిన యసుకుసుమంబులచే నీయార్యామహాదేవి నర్చించి సంతోషపెట్టెదను. (మరల నాకాశమున) ఓ కాత్యాయనీ!

తే. గీ. ప్రణతకామితమందారవల్లి! తల్లి! । యనుఁగుఁజెలి నాకు మల్లిక యబ్బదేని
నాదు హస్తాసి లూనకంఠంపు మోము । గనుమి పుడు నీపదములఁ గోకనద మగును

(కత్తి దూసి సప్రార్థనముగా)

తే. గీ. పద్మపాటల మైన నీపదము లందు । దేవి గో! నాకు భక్తి నర్థిల్లఁ గాక;
యనుఁగు మల్లికతోడ జన్మాంతరంబు । నందు నైనను సంగమ మబ్బఁ గాక.

(ఖడ్గము కంఠమునం దుంచుకొనుచున్నాఁడు)

(ఆకాశమున) హా! నాథ! మారుత! రక్షింపుము రక్షింపుము. రాక్షసహస్తమునం దిట్లు చిక్కియున్న నన్నేల చూడవు? మొట్టమొదట మత్తుతేనుఁగుహస్తమునుండి నన్ను విడిపించి బ్రతికించినవాఁడవు నీవే కావా? హా! యంబ! గౌరి! నేను సత్యముగానే రాక్షసహస్తమున జిక్కఁబడితిని. హా! తండ్రి! హా! తల్లి! యిదిగో! గౌరీప్రసాదలబ్ధ యయిన మీయేకపుత్రి మల్లిక చెల్లి పోవుచున్నది. హా! మాతృసమానురాల! భగవతి! మందాకిని! యిదిగో! నేను నీయాశ్రమపుసమీపమునకే తేఁబడినదానను. అమ్మా! నామీఁది ప్రేమచేతను గదా నీవు హిమగిరిని విడిచిపెట్టి యిచ్చోటికి విచ్చేసితివి! హా! సఖి! నవమాలిక! హా! కాళింది! మీదర్శన మిఁక నాకు దుర్లభము గదా! (ఖడ్గము కంఠమునుండి తీసి సంభ్రమాభిప్రాయములతో) ఏమిది! మల్లికాస్వరము కరుణకరుణముగా గగనగోచరమగుచున్నది! [విషాదవితర్కములతో]

ఉ. ఆక వసింప మేఁడపయి నభ్రము మిం చని కొంచుఁ బోయెనో?
నాక మలంకరింప సురనాథుఁడు వేలుపులన్ హరించిరో?
ప్రాకటభూష చంద్రకళ రాలె నటంచు గిరీశుఁ డెత్తెనో?

యేకసమం దిటుల్ కుశరి నైయు విలపించెదు భీరు వే మొకో? 38

(పైకిఁ జూచి) అన్నన్నా! యెంతప్రమాదము

సీ. గుండె జల్లనుపల్లకోరమీసంబులు, వ్రేలుజుంజుఱురాగి వెంద్రుకలును
ముడివడ్డబొమలమోమును, బెడ్డతలకాయ, కఱకు దేరినవంక మెఱుఁగుఁగోఱ
లుఱుకుగ్రుడ్డులుగల్గి వ్యోమంబునను పమశ్చ్యయమాల్లుతోఁ జనీభయగుఁ డెవఁడో?
తెలిసె నిశ్చయము; రాత్రించరుఁడు వీఁడు, ప్రస్ఫాపించుచున్నాఁడు; దైవమెంత
యాపదఘటించె! నదె వానియంకతలము
నుండి ప్రభ్రష్ట యాచుఁ బయోధరంబు
వలనఁ గ్రొక్కారుమెఱుఁగుఁదీవయును బోలెఁ
బడెడు మల్లిక గడగడ వడఁకు చహహా! 39

(కన్నీళ్ళతో) హా! విధాతనిష్కరుణత!

చ. మునుగును నేన నేన యని బోటులు చేతుల నూఁత యీయవో
పవనములదారి నైనఁ గటిభారమునన్ మెలమెల్లడిగ్గునం
గన గగనంబునుండి పడిగాఁబడు గాంగఝురిం బెకల్చి చి
మ్మనచవుపంతిచేతిబలిమిం బడుబంగరుఁదమ్మితీఁగ నాన్. 40

ఈమెను నేను బడకుండఁ బట్టుకొనియెదను. (ఖడ్గము క్రిందఁ బెట్టి చేతులు వెలికిలఁ బయికెత్తుచున్నాఁడు)

(తరువాత మారుతహస్తగతయయివడఁకుచున్నమేనితో మల్లిక ప్రవేశించుచున్నది)

మల్లి—హా! పడిపోయితినిగదా!

మారు—(కన్నీళ్ళతో) అదృష్టవంతురాల! భయపడకు భయపడకు.

చ. మదిఁ బదిలించుకొమ్మిటులు మాటికి మేను వడంకనేల? నీ
కొదవ దుపద్రవం బసురయుక్షతి నేని మఱొంటనేని యిం
కిది యభయప్రదేశము సుమీ! భవదీయవిధేయుచేయి యన్
మృదుతలిమంబునందు వసియించినదానవు చూడు సుందరీ. 41

మల్లి—(చటుక్కునఁ జూచి) అహో! మహాభాగుఁడే. హా! మహాభాగ! (కంఠము గౌఁగిలించుకొనుచున్నది)

మారు—సుందరీ! యిది యేమి?

మల్లి—(తడవుగ నిశ్వసించి సిగ్గుతో) నేనాకాశవాణీప్రమాణమువలన మహాభాగుని పాదసేవ దుర్లభ మని తలంచి యీయర్ధరాత్రమునఁ బ్రాణసఖి యయినవమాలిక

ను గూడఁ గన్నుమొఱఁగి మరణమునఁ గృతనిశ్చయురాల నయి భవనోద్యానమునకుఁ బోయితిని. పోయినతోడనే యెవఁడో రాక్షసుఁ డొకఁడు న న్నాకస్మికముగా నెత్తుకొని యాకసమునఁ బఱ గెత్తుచుండఁగా దైవికముగా వానిబారికిఁ దప్పి యిప్పుడు దేవరచేతిలోఁ జాఱి పడితిని.

మారు—(ఉచ్ఛ్వాసముతో)

ఉ. పాయవు శ్లాఘ్య జీవమును బంధుజనప్రియ! నాకన్నై, శుభం
బీయమృతంపుమేను వొలియింపఁడు పీనుఁగుఁదిండి, పుణ్య మా
హేయునిచేతికిం దొలఁగి తీగతి, భాగ్యము; నేలఁ గూలుచున్
నాయెద హేమమాలికయనం గయి సేసి తపృష్టమే, ప్రియా. 42

మల్లి—మహాభాగ! మీ రేల యిక్కడ దేవతాద్వితీయులరుగా విజయంచేసియుంటిరి?

మారు—ఉ. ఏనును నాశిరోంబుజము నీగిరిరాజతనూజ కింపుగాఁ
గానుక యిచ్చి, గన్ బడయఁగా మదిఁ గోరి, కురంగనేత్ర! కం
ఠానఁ గదించుకొంటి (చేతఁ జూపుచు) నికటస్థిత మీ యసి కేలఁ బూని-

మల్లి—(తొట్రుపాటుతో) మహాభాగ? సాహసము చేయకు.

మారు—(చిఱునవ్వుతో) యా! లోనసె నీదుశోకపుటెలుంగు చెవిం బడఁ దెంపు మానితిన్. 43

మల్లి—(తనలో) అయ్యో! కడచినవృత్తాంతము చెప్పఁబడుచున్నది? (సకరుణానురాగముగా) ఆహా! నానిమిత్తము మహాభాగుఁడు ప్రాణత్యాగము గూడఁ జేయఁ బ్రయత్నించెనే!

(తెరలో) ఎవఁడో యాయువు చెల్లినవాఁడు నాయుత్సంగమందలిమానవకన్యను దొంగిలించినాఁడు. నాయొడిలో నప్పటిరీతి యిప్పుడు కనఁబడ కున్నది. నే నొక్క యుఱుకున దానిని సింహళద్వీపముఁ జేర్ప నాలోచించితిని.

(ఇద్దఱు వినుచున్నారు)

మారు—(నవ్వి) ఆహా! దేవీప్రసాదమున నీమె నాచేతిలోఁ బడినసంగతి యీమూర్ఖరాక్షసుఁ డెఱుంగఁడుగదా!

మల్లి—(భయముతో) అయ్యో! రాక్షసుఁడు మరల వచ్చుచున్నాఁడు. (వడఁకుచున్నది)

మారు—(నవ్వి) సుందరీ! భయపడకు, క్షణమాత్ర మా చెట్టుచాటున నుండుము. ఈ పాఁటిరక్కసుని నేను జెండాడెదను.

రుఁడా! మేలు మేలు!

తే. గీ. గాఢవిషవహ్నిభీషణకాలసర్ప। విస్ఫుటస్ఫటఫలకశోభితమణిశిల,
నస్మదీయాంకమధ్యపర్యంకవిధృత। జవ్వనిని గవ్వినాఁడ వీ వెవ్వఁడవుర?

మారు—(సక్రోధముగా) హా! లోకవిద్విష్టాచార! వెండియు నీవ్యవహారము కన్యకాగోచరమే యగుచున్నది. (తిరస్కారముతో)

మ. అరితిం బాపమతీ! పలాశ! చపలాత్మా! శ్వాన మాజ్యాహుతిం
బోరయం బోలునె? బాల నంటు టెటు? ఛీ! పో జీవ మాశించితే;
మరికాదేని, కఠోరఖడ్గదితయుష్మత్కంధరాంతస్సిరాం
తరసఘ్యాతకవోష్ణరక్తఝరమేదస్విన్ ధరం జేయుదున్. 49

రాక్ష—(బొమముడితో) ఆ! వికటగ్రీవుఁడ నగు నాయెదుట నిలుచుచు నిశ్శంకముగాఁ బొగడుకొనుచున్నావు! (బాగుగఁ జూచి ప్రత్యభిజ్ఞతోఁ దనలో) వీఁడే మద్గుకూలాంచలలిఖితుఁ డయినపడుచువాఁడు. చిత్రకన్యాచోరుఁ డని ఖడ్గజిహ్వుఁడు నాతోఁ జెప్పినవాఁడును వీఁడే. (పరిహాసముగా)

ఉ. ఏలరమర్త్యడింభ! నిరపేక్షుఁడవై నిజజీవమందు, నా
మ్రోలకు వచ్చినాఁడ విటు? మూఢుఁడ! పుణ్యము; కన్యకేమిపో
నీకులఁ జింతపండు బలె నీమృదులాంగము మేళగించి తృ
డ్జ్వాల శమింపఁగా గుటగుటం దియనెత్తు టిచారు ద్రాగుదున్. 50

(మారుతుని మూఁపునఁ బెట్టుకొని పరుగెత్తుచున్నాఁడు)

మల్లి—(సత్వరముగాఁ జెట్టుచాటుననుండివచ్చి రోదనముతో) భద్ర! రాక్షస! యిదిగో నంజలిపట్టి వేఁడుకొనుచున్నాను. మహాభాగుని విడిచిపెట్టుము. వెండియు నన్నె భక్షింపుము.

రాక్ష—(చెవిని బెట్టక నిష్క్రమించుచున్నాఁడు)

మల్లి—(కన్నీళ్ళతో) అయ్యయ్యో! మహాభాగుని రాక్షసుఁ డెత్తుకొనిపోయినాఁడు. (సకరుణముగా) హా! సకలలోకలోచనచకోరవారపూర్ణచంద్ర! హా! కందర్పమనోహరాంగ! హా! సుజనచూడామణి! హా! పుండరీకలోచన! హా! లక్ష్మీవిహారభవన! హా! మల్లికాహృదయవల్లభ! హా! మారుత! సర్వలక్షణలక్షితమైనసీకమనీయవిగ్రహము రాక్షసాహారమగుచున్నదా నాథా? అయ్యో! నేనెంతపాపాత్మురాలను! ఎంతయదృష్టహీనురాలను! కష్టా! దైవోపహతురాలను గదా! సర్వానర్థములకు మరల మరల నేనేకారణ మగుచున్నదానను. (నిట్టూర్పు పుచ్చి) నా

బ్రతు కింక నిరర్థకము. అయ్యో! మరణము కూడ నాకు దుర్లభ మయినది. భగవతి! భూతధాత్రి! నాకు వివరమిచ్చి నీలోనికిఁ దీసికొమ్ము కటకటా! సకలభువనమును గాలాంజననీల మయినకటికిచీఁకటి క్రమ్ముకొని యున్నది. నేనెక్కడకుఁ బోదును? ఎవ్వరికి మొఱ్ఱ వెట్టుదును? హా! దిక్కుమాలినదాన నయితిని గదా! (రోదనము చేయుచున్నది)

(తొట్రుపాటుతో మందాకిని ప్రవేశించుచున్నది)

మందా—బిడ్డా! భయపడకు. భయపడకు.

మల్లి—(చూచి కన్నీళ్లతో) అమ్మా! భగవతి! భగవతీ! రక్షింపుము రక్షింపుము.

(పాదములఁ మీఁదఁ బడుచున్నది)

మందా—సకరుణముగాఁ గౌఁగిలించుకొని)

చ. తెలిసితి జ్ఞానరూప మనుదృష్టికితంబున భీరురాల! మీ
విలయవ్యసనానుబంధము సమస్తము; కస్తిని బొంద కిం కిటక్;
దొలఁగెసుము గద్రుమరక్కసులు; సెగమ చీఁకటి విచ్చుమొగ్గగున్;
కనుఁ రేయి; దైవముస దోఁచగుఁ గ్రమ్మఱ! భద్ర మయ్యెడున్. 51

మఱియు మారుతుఁడు రాక్షసహస్తగతుఁ డయ్యె నని సంతాప పడకుము.

తే. గీ. భవ్యశౌర్యవిడంబితసవ్యసాచి। మారుతుఁ బరాభవింపంగ లే రసురులు;
ప్రాక్పయోధిరజ్యంధమాకాంశుబాలభాను। దట్టమగుచీకువా లరికట్టఁ గలదె?

(తెరలోఁ జటచటధ్వని)

మందా—(చూచి యానందముతో) మారుతపరాక్రమ మెఱుఁగనిదానా! మల్లికా! మహాభాగుని చండిమము చూడుము.

క. మూఁపునముండి యంపడ। కాపిశితాశనునిశిరము నతఁ డసిఁ దునిమెన్
తెఫ్ఫునఁ గరికుంభము వ। జ్రోపమనఖరాంకుశమున యువహరి వోలెన్. 53

మల్లి—(హర్షముతోను భయముతోను జూచుచున్నది)

మందా—(ఆనందముతో)

చ. అసిహతమస్తకుం డగుచు నద్దిర! బిట్టద్రువం ధరాతలం
బసురుఁడు వజ్రఘాతదళితాద్రితటంబును బోలెఁ గూలెడున్

(ఆశ్చర్యముతో)

విస్మృతి పుఁ దత్కబంధమున వెల్వడి యుజ్జ్వలభూషణుండు మిన్
దెసఁ బురుషుం డొకం డహహా! దివ్యశరీరము దాల్చి యేగెడున్. 54

మల్లి—(విస్మయానందములతో) భగవతీ! యిది మహాశ్చర్యము! అతిభీషణుం డగు రాక్షసునివలన దివ్యపురుషుఁడు బయలు వెడలినాఁడు. చూడు. చూడు. ప్రదక్షిణము చేసి ఫాలప్రదేశసంఘటితాంజలిపల్లవపుటుం డయి మహాభాగునకు నమస్కరించుచున్నాఁడు.

మందా—(ఆలోచనతో) ఎవఁడో దివ్యపురుషుఁడు శాపవశమున రాక్షసుం డయ్యెనని తలంచెదను.

(తెరలోఁ గలకలము ఇద్దఱును వినుచున్నారు)

మల్లి—(భయముతో) భగవతీ! రాక్షసభయంబునం జేసి మరల రాక్షసుండే వచ్చుచున్నాఁడని తలంచుచున్నాను.

మందా—(చూచి) బిడ్డా! యిదిగోఁ గన్నీరు విడుచుచున్న నీతండ్రి నమాత్యవిశ్వాసునిఁ బురస్కరించుకొని నిన్ను వెదకుచు బెడిదంపుఁ గైదువులు గైకొని వీరపురుషు లిటు నటు సర్వత్ర దిరుగుచున్నారు.

(మరలఁ దెరలో) హా! పుత్రి! మల్లికా! యింద్రనీలప్రకాశముఁ జూచి కూపెఁ జీఁకటి యని జడిసెడుదానవుగదా తల్లీ!

మల్లి—(కన్నీళ్ళతో) అయ్యో! నాయనగారేడ్చుచున్నారే మిచేయుదును?

మందా—బిడ్డా! నిన్నుఁగానక దుఃఖపడుచున్న మీతండ్రిగారినూఱడించి, నీకుఁ బ్రాణదానమహోపకారము చేసి విజయమున వర్ధిల్లుచున్న మారుతునిఁ గూడ సంభావింతము రమ్ము. (నిష్క్రమించుచున్నారు)




ఇది శ్రీపరమేశ్వరవరప్రసాదసమాసాదితసరసకవితాధురంధర నడ్డాది సాగువంశక్షీరనీరాకరరాకాసుధాకరాచ్చనామాత్యపౌత్రహారితసగోత్ర గుణకదంబ లక్ష్మాంబాగర్భశుక్తిముక్తాఫల సూరపరాజప్రధానతనూభవ విబుధవిధేయ సుబ్బరాయనామధేయాంధ్రీకృత మల్లికామారుతప్రకరణమునందుఁ బంచమాంకము.

సమాప్తము.



తనుఁ వివాహోచితము లయిన మంగళభూషణములను సవిశేషముగా నామెకిఁ బ్ర డలంకరింపు మని భగవతి నీ కాజ్ఞాపించుచున్నది. పెండ్లివారు రాక మునుపే నీ వీ పని నెఱవేర్పవలయును జుమీ.

మక — (తనలో) ఇది మంచిదే. మాధవుఁడు గూడఁ గలహంసభ్రమరకసహాయుఁడయి యిక్కడనే యున్నాఁడు. అతనిని నిగూఢముగా నక్కడకు సారసిక తోడుకొనిపోయినది గదా! ఇఁక నేనును దగినసంవిధానమునఁ బ్రవర్తించెదను. (ప్రకాశముగా) చపలకా! యిదిగోఁ గంచుకులు భగవతి యాదేశమును జరుపుచున్నారు. ఆమె చేయవలసియున్నది సులభముగా సంపాదింపవచ్చును బొమ్ము. (నిష్క్రమించుచున్నాఁడు. ప్రవేశకము)

(తరువాత మాధవుఁడు కలహంసుఁడు భ్రమరకుఁడు ప్రవేశించుచున్నారు)

మాధ — భ్రమరకా! మల్లిక యీచేరువ లతామంటపము నడుమ నున్న దన్నమాట సత్య మగునా?

భ్రమ — ప్రభువా! కాళిందీనవసఖికలు మంగళాలంకరణమును జేయుచుండఁగా నామెను జూచినాఁడ నని మనవి చేసితిని గదా!

మాధ — (నిట్టూర్పుతో)

శా. చేనిం బొందఁ దపస్యమగ్నదృఢసజ్జాతిం గూరి మున్ గోరితిన్,
దేనిం గాంచుట దుర్లభం బని మదిన్ భీతిం బ్రాణత్యాగమే
యే నర్థించితి, నట్టి జీవితఫలం బిప్పట్టునం గరప్రాప్తమ
ట్లౌ; నంబా! భవితవ్యతా! మరల నెట్లా విచ్ఛవింతో గదా! 1

కల — మిత్రుఁడా! సంశయింపకుము. గొంతు గోసికొనుట కయిన జంకు లేక నీవు సాహసింపఁగానే మల్లిక నీచేతిలోఁ బడినది గాన జీవితఫలము భవానీప్రసాదము వలన నీకుఁ గరప్రాప్తమే.

భ్రమ — ప్రభువా! లతామంటపమునకు మార్గ మీనల్లికాపశముల నడుమనుండి.

మాధ — భ్రమరకా! యీప్రదేశము దట్టంపుటాకుజొంపముల గుబురయినతీవలగుంపుకతమున జీకటి గొని యున్నను బరిజను లెవ్వరయిన వత్తురేమో యనుశంకవలన నెమ్మది లేక కాలు గదలింపఁ జాల కున్నాను.

భ్రమ — ప్రభువా! భగవతి యాజ్ఞచేతఁ బరిజనమును వేత్రహస్తు లుద్యానవనమునకు దవ్వులనే యాటంకపఱిచి యున్నారు.

మారు—(హర్షముతో) ఓహో! భగవతినీతి సర్వత్ర యప్రమాదిని గదా! దా
రి చూపుము.

భ్రమ—ప్రభువా! యిటు. ఇటు.

(అందఱు నడుచుచున్నారు)

కల—(చూచి) ఓహో! యమాత్యవిశ్వావసుఁడు గారిభవనము ప్రత్యాసన్నవైవాహికమంగళమును సూచించెడు నుదాత్తమండనవిధానముచేత నెంతచక్కఁగా శోభిల్లుచున్నది!

ఉ. తేనియ లుట్టి ద్వారముల దిద్దిరి వందనమాల లుంచి రిం
పైనవి క్రొత్తచిత్తరువు లచ్చపుమేడల గోడలందు, సం
ధాన మొనర్చి రామపువితానములందు సుహాణిజల్లులన్
మానుగ వీథివాకిట సమర్చిరి బంగరుఁ గాయమానముల్. 2

మఱియు—

ఉ. లీల నళింపకేతుపటలీపట పల్లవముల్ గవాచ్ఛమున్,
దాలిచి తోరణప్రసవదామసుగంధమరందబిందువుల్,
గాలులు వీచు వల్లవిచలత్కుచకుంకుమఘర్మవేగసాం
దోలనచేటికామృదులదోర్వలయధ్వను లాహరించుచున్. 3

భ్రమ—(చెవి యొగ్గి) ప్రభువా! కేవల మిది నలయస్వనియే యనియెద వేమి? అటు నిటుఁ బ్రధావించెడు వారసుందరులకతంబబింబముల వ్రేలుచున్న మణిమేఖలాసహస్రముల ఝణఝణత్కారంబులఁ దోరం బయి, ఘూర్ణమానసకలాంతఃపురగానంబుల భూషణారావంబులఁ బూరితం బయి, గుంజన్మంగళమృదంగశంఖకాహళాదినినాదంబుల నిష్ఠురం బయి, సన్నిహితమహీసురదేవసర్గసంపఠ్యమానపుణ్యాహఘోషంబున మాంసలం బయి, వృద్ధపురాంగనాజనసమారబ్ధంబు లైనపవిత్రపార్వతీలక్ష్మీకల్యాణగానంబుల ననూనం బయి యీయుత్సవకోలాహలము మహీయముగా నున్నది గదా!

మారు—(నిశ్వసించి) సఖా! కలకంఠ!

క. రమణీమణికిం బరిణయ। సమయము ప్రాపించుకొలఁది సాన్నిధ్యము, చి
త్తము సంశయడోలారూ। ఢ మగుచు నూఁగాడెఁ గాఁ దొడఁగెడు నాకున్. 4

భ్రమ—ప్రభువా! లతాభవనసమీపమునకు వచ్చినారము.

మారు—(సంతోషముతో) మల్లికావాససుభగమయినలతాభవనమా యిది?

కల — ప్రసాధనసమయసంభావ్యమయి క్షణోత్పన్నవిరత మయ్యెడుభూషణఝంకారము వినఁబడుచున్నది గదా!

భ్రమ — ప్రభువా! మంగళస్నానవిశుద్ధముగ్ధ మయినపరిక్షామపాండురాంగంబుచే సవిశేషలోభనీయదర్శనయుఁ ప్రసాధననిపుణనవమాలికానిర్వర్తితవివాహనేపథ్యమసురోదారవేషయు నయి సాక్షాత్కరించిన యుద్యానలక్ష్మివలెఁ దీఁగలసందులనుండి యదిగోఁ బూజ్యురాలు గనంబడుచున్నది.

కల — (పత్త్రజాలకాంతరమునుండి విలోకించి) మిత్త్రుఁడా! చూడు చూడు.

మ. ఇది సుక్షామమనోహరాంగకము లెంతేఁ గాంతిపూరంబులన్
వెదచల్లన్ నయనాంబుజంబులకు నుద్వేలప్రమోదంబుగాఁ,
గొప తేఁట్టివి భూషణంబులు హొరంగుం బెంపఁ గల్యాణి యీ
పొదరుందీవలయొప్పఁ దాను నొకపూవుందీవ యై భాసిలున్. 5

మారు — (ఆనందముతోఁ జూచి) ఇదిగో నీమె కొంచెముగా మోము పెడమరల్చినది. కాళిందీనవమాలికలతో నేమో సల్లాపించుచున్నది సుమీ. మన మీతీఁగలనడుమనుండి ప్రవేశించి రహస్యముగాఁ జూతము. (అట్లు చేయుచున్నారు)

(తరువాత మున్ను చెప్పినట్లు మల్లికయు, నవమాలికయుఁ గాళిందియుఁ బ్రవేశించుచున్నారు)

మల్లి — సఖులారా! మీవిప్రలంభవచనము చేతనే నే నీయలంకారమున కనుమతించితిని.

నవ — సఖీ! నీవు వేఱుగాఁ దలంచుకొనకుము. (మారుతునిఁ జూచి సంతోషముతో జనాంతికముగా) కాళింది! మహాభాగుఁడు వచ్చి వెనుక నున్నాఁడు. వెల్లడింతమా? ప్రియసఖికి సత్యమని నమ్మిక పుట్టును.

కాళిం — సఖీ! వెల్లడింపకు. సమయము వచ్చినప్పుడే వెల్లడింపవలయును.

నవ — (చిఱునవ్వు నవ్వి) సఖీ! మల్లికా! నీవు మమ్మును వంచించితివి గదా!

మల్లి — (అనుతాపముతో) ఎప్పుడు?

నవ — సఖీ! రాత్రివేళ మమ్ముఁ గూడఁ గన్నుమొఱఁగి ప్రాణపరిత్యాగమునకుఁ బ్రయత్నించినదానవు కావా?

మల్లి — (సిగ్గుపడుచున్నది)

కాళిం — అదృష్టవశమున వెంటనే రాక్షసునిచేత గృహీత వయి మహాభాగునిహస్తమునందుఁ బడినదానవు.

కల — సఖా! మల్లిక పడినచోటనే నీవుండుట యెట్లు తటస్థించినది?

మారు—మిత్రమా! నే నుపవనాంతరమునఁ బ్రవేశింప నెంచియుఁ గాలు దొట్రిలినందున సంశయించి యక్కడనే నిలువఁబడితిని.

మల్లి—కాళింది! రాక్షసుఁడుగాఁడు. ఎవ్వఁడో యొకదివ్యపురుషుఁడు. అతఁడు మహాభాగునకు జన్మాంతరమిత్రుఁ డని భగవతి నాకుఁ జెప్పినది.

(ఇద్దఱు విస్మయపడుచున్నారు)

కల—సఖా! యేపురాక్షసజన్మమునుండి యీయనను నీవు విడిపించితివి గదా! ఆ మహాపురుషుఁ డెందుఁ బోయినాఁడు?

మారు—అతఁ డత్యంతసౌహార్దమున నాతోడ మాటలాడి సఖుఁడా! నీవు నన్నుఁ దలంచుకొన్నతోడనే నీయొద్దకు వచ్చి నీయుపకృతిని నేను నెఱవేర్చి పోయెద నని పలికి వెంటనే తిరోధానము నొందెను.

నవ—కాఁబట్టి నీవే విప్రలంభశీలవు.

మల్లి—నీయుపాలంభ ముచిత మయినదే.

నవ—సఖీ! నీ కీయలంకరణ మనుకూలముగా నున్నదో లేదో చెప్పు.

మల్లి—(సిగ్గుతో చిఱునవ్వుతో) సఖీ! యిది నాయలంకారము గనుక నెట్టన నిట్టిది యని ప్రశంసింపఁ జాలకున్నాను. ఇంతియకాని నీప్రసాధననైపుణి వాగతీతమే.

కల—వాగతీత మని మల్లిక చక్కఁగాఁ జెప్పినది. ఇం దొక్కొక్కటే వర్ణనము నతిక్రమించుచున్నది. ఇది చూడు—

తే. గీ. వలచునభినవకుంకుమపంకమునను। దిద్దుమదిరాక్షిముద్దులతిలక మొప్పు;

మారు—(అభిలాషతో)

రక్తమై రమ్యనవసామ్రాజ్యసక్తమై యు। చంచలత నిల్చుమామకస్వాంతమట్లు. 6

కల—(చిఱునవ్వుతో) సఖా! నావచనమును నీ వపహరించితివి.

భ్రమ—అయ్యా! చూడు మారుఁడు ప్రభువుగా రొసంగిన హారయష్టి యీమె కంఠమూలమును జుట్టుకొని యున్నది

కల—(చక్కఁగాఁ జూచి) నిజముగా నిది వయస్యదోరంతరవిహారసమల్లిత మయిన హారవల్లియే. (విమర్శించి)

మ. స్మరదాహంబునఁ బాండుమూర్తి నగుచున్ శంఖంబుపోంకంబుదా
హరియింపం గలకంఠకాంతమున నీహారంబు భాసిల్లెడున్;

మారు—

హరిణాక్షీవదనంబు నిక్కముగ నేణాంకుఁడుగా నెంచి యం

టి కీబాష్పస్తబకములు నీ చెక్కుటద్దముల వ్రాసినపత్రలేఖలను జెఱిపి కాటుక గ
రంగఁ గాలువలు గట్టుచున్నవి?

మల్లి—(నిశ్వసించి) సఖీ! నవమాలికా! మనోరథసహస్రములచేత సంవర్ధిత మయి
నట్టి ప్రియవస్తువును విఘటించునిష్ఠురవిఘ్న మనియెడుమృత్యుదేవతకత్తుకను
జొచ్చి బాధపడుచున్నదానినిగా నన్నెఱింగి యుండియు నీవు గూడ నిట్టులాయా
సపెట్టెద వేల? (నిశ్వాసముతో) జీవితనిర్విశేషురాం డ్రగుప్రియసఖుల కిది యుక్త
మే. ఇంతపనిక నయ్యయి విప్రలంభవచనములచేతఁ బ్రతారించి యిప్పుడు వెండి
యు నన్నా హాయుపుఁగుంభీపాకమునఁ గూలఁ ద్రోయఁ బ్రవర్తించెదరు.

కల—వయస్య! నీసౌభాగ్యమును జూచుకొనుము.

ఉ. ఈమె ప్రియాలివాక్యముల నెంతయు నమ్మి భవత్సమాగమా
శామిళితాత్మ, ముగ్ధ, తన చక్కఁగమున్ గయిసేయ నిచ్చి, యి
ప్పొ మది బాష్పకంఠి యయి ప్రుక్కెడు నన్యవివాహసంశ్రుతిన్,
లో మొగులుం దలంచి దిగులుం గనుబాలమరాళిపోలికన్. 11

నవ—(సకరుణముగా, జనాంతికముగా) కాళిందీ! మనసులోని దుఃఖముచేత నతివి
షణ్ణ మయిన భర్తృదారికావచనము నాలకింపుము.

క. అనుకూలవిప్రలంభము లను మన మొందింప నుమ్మలము సస్నేహం
బును సవిషాదము నోల్లం గనుము సధిక్కారమునుగ నాతి వచింపన్. 12

(ప్రకాశముగా) సఖీ! యీమావిప్రలంభవచనమునకుఁ గినియకుము. ప్రసన్నవు గ
మ్ము. (మారుతునిఁ గడకంటఁ జూచి) నీయందు సవిశేషబద్ధానురాగుఁ డయిన
యీయనకు నీకరకమలము నొసంగుము. బంధువర్గము నానందపఱుపుము.

మల్లి—(శోకభారముతో) సఖులారా! తరుణమయూరపింఛమువంటి నిద్దంపుఁ జా
మనచాయ గలనునెఱివాంగమున నెసంగుమహాభాగుని మారుతుని సంపర్శించినది
మొద లన్యపురుషునిఁ దలంచి యేని యెఱుంగను; కావున సత్యప్రమాణముగాఁ
జెప్పుచున్నాను. విను మహాభాగునిపూర్ణలావణ్య మనెడుభాగీరథీప్రవాహమున న
వగాహనము గావించుటచేతఁ బవిత్రము లయిననానేత్రములతో లాఁతివాని నిఁక
ముందును జూచుదానను గాను.

కల—మిత్రుఁడా! యీవచనామృతమును వీనుజేరలతో గ్రోలుకొనుము.

మారు—మదీయమానసవిహారమల్లికాక్షి! మల్లిక!

చ. హృదయమునన్ నిమేష మగుప్రేమగ సాలిపె యుంచ్చుచున్న ప్ర

న్నది కడుఁ బొంగి పైఁబొరలు నా, హృదయంగమ మైనపల్కులన్
మనమనమోహనాగ్ని దగ్ధుఁడయి క్రుంగెడు నా కమృతాభిషేకసం
పద గలిగించిన ట్లయితి; ప్రాణము వచ్చెను బ్రాణనాయకా. 18

(మరలఁ జెరలో) నవమాలికా! త్వరపడుమను మన్నారు. సిద్ధాంతులు పెట్టిన వివాహ ముహూర్తము సమీపించుచున్నది.

(అందఱు వినుచున్నారు)

మల్లి—(కన్నీళ్లతో) అమ్మో! భగవతి మాటల నాజ్ఞాపించుచున్నది. సఖి! నవమాలిక! లే లెమ్ము. భగవతి తానుగానే యిక్కడికి వచ్చెనేమో; ఇంతలో నే యీ లోకలతావలయమున కరిగి మిమ్మొక్కటి ప్రార్థించెదను.

నవ—సఖీ! నీ వాజ్ఞాపనాయోగ్యురాలవు. ప్రార్థించుట యేమి? నమ్మ నీయిష్ట వచ్చినకార్యమునందు యథేష్టముగా నియోగింపు భగవతి యాదేశమును నిర్వర్తింపుము.

మల్లి—సఖి! విషాదసంభ్రమములచే నాదేహము కంపించుచున్నది. కాబట్టి నేను లేవలేక యున్నాను. నాకన్నులయందు బాష్పపూరము నిండుచున్నది; నే నిలుచు చోటఁ జూడను సయితము చాలకున్నాను. నీవే నాచేయి పట్టుకొని లేపఁ గొని మెల్లగా లతావలయాంతరమున నన్నుఁ బ్రవేశపెట్టుము. (చేయి చాఁచుచున్నది)

సఖులు—సంజ్ఞచేఁ బాణిగ్రహణమునకై మారుతునిఁ బ్రేరేపించుచున్నారు)

మారు—(భయమును నభినయించుచున్నాఁడు)

కల—మిత్రుఁడా! యిది సాధ్వసమునకు సమయము గాదు. చిరకాంక్షితమైన మల్లికాపాణిగ్రహణమహోత్సవము ననుభవింపుము.

మారు—(లతావలయమునుండి వెడలివచ్చు మల్లికపాణిని ననురాగముతో గ్రహించుచున్నాఁడు)

మల్లి—(హర్షముతో) సఖీ! నవమాలిక! నీచేయి మిక్కిలి వేఁడిగా నున్నది. చేయి పట్టుకొన్నంతమాత్రమున నాయవయవము లన్నియు నమృతసముద్రమునఁ బడినట్లు సుఖపారవశ్యము నొందుచున్నవి. (మారుతునే యూఁతకొని లేచుచున్నది)

మారు—(బదులు పలుకకయే మెల్లమెల్లగాఁ గొనిపోవుచున్నాఁడు)

సఖులు—(చిఱునవ్వుతో వెంబడించుచున్నారు)

కాళిం—సఖీ! మల్లికా! లతాగృహమునకు వచ్చినాఁడను కాఁబట్టి నెప్పుడు వచ్చిన దేమో చెప్పు

మల్లి — (నిట్టూర్పుతో) సఖీ! నవమాలికా! యేతీఁగ మొదటికి వచ్చినారము?

మారు — బహుళకుసుమరసపరివాహమందరపరిమళలోలలోలంబపుంజఝంకృతిముఖర మీ మందారమూలమునొద్దకు.

మల్లి — (సబాష్పకంఠముగా) ఈమందారము నేను పెంచినదే. కాఁబట్టి నిర్జనమైన యీప్రదేశమునందు మి మ్మొకటి ప్రార్థించెదను.

కాళిం — సఖీ! మే మవధానము గలిగియున్నాము.

మల్లి — ఓ జీవితనిర్విశేష! మారుత! (అర్ధోక్తిని వైలక్ష్యమభినయించుచున్నది)

సఖులు — (పరస్పరము నవ్వుకొనుచున్నారు)

మల్లి — ఓజీవితసర్వశేష! నవమాలిక! సఖీ! కాళింది! పరిపూర్ణచంద్రసుందరాకారుండగుమహాభాగుని పాదములకు శుశ్రూష చేయుసౌభాగ్య మభిలషించి కదా విఫలమాన మయిన నాజీవితమును నిలుపుకొంటిని. ఆకందర్పసుందరుని ప్రథమదర్శనము మొదలిప్పటివఱకును గృహాస్థికారవిందమకరందవాహులయి మందమందముగా వీతెంచెడు సుద్యానవనమారుతములకు నోర్చుకొనుచుంటిని. ప్రచండమకరధ్వజభుజదండమండలితధనుర్దండటంకారఘోరము లయినమధుకరహుంకారముల నాకర్ణించుచుంటిని. చిగిరించినతీయమామిడిగుబురులలో విహరించుచుఁ గోకిలములు గావించెడు పంచమప్రపంచము హాహాకారముచే దురంతము లగువసంతదివసములు వేగించుచుంటిని. ఇంతియ కాక కిసలయతల్పకల్పనములచేతను, మృణాళభంగహారరచనములచేతను, కదళీదళపవిత్రవీజనములచేతను ఘనసారపరాగచర్చికాసంపాదనములచేతను నింకను పత్త్రముచితోపచారములచేతను, మిమ్ములను గూడ నాయాసపెట్టుచుంటిని. అట్లు రాక్షసహస్తమునుండి జాతి యాకాసమునుండి క్రిందఁబడుచు నిష్కారణ మాత్రమున నెవ్వనిచేత రక్షితనయితినో యట్టిమహాభాగునిసంగమ మెవరికో పుణ్యాత్ములకుఁ దక్క సులభముగాని నాకు దుర్లభమే. కాఁబట్టి నాజీవితధారణము క్షణమేనియు మహాపాతకములలో నగ్రగణ్యమని తలంచెదను సఖులారా! జన్మాంతరమునఁ బునర్దర్శనము గోరుచు మిమ్ము వీడుకొనుచున్నాను. (సప్రశ్రయముగా నంజలి పట్టి సగద్గదముగా) సఖీ! నానిమిత్తము నీవిట్లు సమస్కరించి సుందరస్రోతస్సీమబాంధవుండును దీర్ఘనిర్నిద్రాలోచనపుండరీకుండును నగు నమ్మహాజనుఁడు పరలోకగత నగునాకొఱకు జలాంజలి నిచ్చునట్లు రహస్యమున నాయనతో విన్నవింపవే. (రోదనము చేయుచున్నది)

---

* ఈవాక్యము మూలమునందు సంస్కృతప్రాకృతసమానము.

మారు—(సకరుణముగాఁ దనలో)

మ. హరిహరి మేను వాసెఁబ్రయత్నముతోడ శుభాంగి తానిటుల్
కరుణమనోహరం బగువిలాప మొనర్పఁగ నాలకించుటన్,
సరళితచేఁ గరంగెడును, జాలిని రూపఱుఁ, గందు మోహవి
స్మరమున, వ్రీలు నాత్మ, హరుసంబునఁ బొంగెడుఁ, డెంద మిత్తఱిన్. 14

కాళిం—సఖీ! యమంగళము దొలంగును గాక.

నవ—(కన్నీరు పెట్టుకొనుచున్నది)

మారు—(ప్రకాశముగా)

* క. వీణావిరావకోమల! వాణీబంధుగణచిత్తవనజమరాళీ!
రాణ నెసఁగుసహచారిణి! ప్రాణమునకుఁ దగకు పలుక కతికరుణోక్తిన్. 15

నవ—(జనాంతికముగా) కాళింది! మహాభాగుఁడు తన నేర్పుచేత నచ్చముగా నానలెనే మాటలాడుచున్నాఁడు; కాఁబట్టి యాయన నిప్పటికిని ప్రియసఖి యెఱుఁగదు.

మల్లి—సఖీ! ముగ్ధరాల! సాహస మనియెద వేమి? ఎవ్వనికి జీవలోక మంతయు మృన్మయ మయి కనఁబడుచున్నదో యెవనిహృదయము మదీయాగాధభంగమున నతికాతర మయి యడలుచున్నదో, యంతటియర్ధరాత్రమున నట్టిదుర్గమప్రదేశమున కేకాకి యయి పోయి సకలభూమండలమండన మయి తనకంబుసువరకంధరాకాండము నందు నెవ్వాఁడు క్రొవ్వాఁడికరవాలముఁ జేర్చుకొనునంతటి మహాసాహసమునకు సిద్ధపడెనో, యటువంటినాప్రేమనిధికొఱకు జీవితసహస్రపరిత్యాగ మయినను సాహసము కానేరదు. ఈవిషయమున నీవు నాకుఁ బ్రతికూలవు కాకుము వెండియు మహాభాగునకు నామాటగా నిట్లు చెప్పుము (సగద్గదముగా) నాథ! మందభాగినిని నే నీజన్మమున యుష్మదీయపరిరంభసౌభాగ్యమును బడయ లేక పోయితిని. కానీ జన్మాంతరమున నయినను నీపొందే యపేక్షించుచున్నాను. నాతోఁబుట్టు వగు నక్షత్రమాలికను మాత్రము మరకతకవాటస్నిగ్ధవిశాల మయినమీవక్షస్స్థలమునందు నన్నుఁబోలె సర్వదా ధరించుకొనుఁడు. (మారుతునిఁ దడవుగఁ గౌఁగిలించుకొని యానందముతోఁ దనలో) ఏమిది? ప్రియసఖీసంస్పర్శము మయినంతట మంచిగంధ మబ్బినట్లయి మహాభాగపరిరంభమునకుఁ బ్రతి వచ్చుచున్నది. హృదయసన్నిహితుఁ డయి సుఖింపఁ జేయుచుండె నని తలంచెదను. (ప్రకాశముగా) సఖీ! యిది నాకడసారికవుఁగిలింత సుమీ.

---

* ఈపద్యము మూలమునందు సంస్కృతప్రాకృతసమాసము.

సఖులు—(చిఱునవ్వుతోఁ దమలో) ఇది కపటపు కౌఁగిలింత కాదు. మొదటిదో రెండవదో.

మారు—(కౌఁగిలింపఁ బడియే యానందముతో సహజస్వరముతో)

ఉ. ఎవఁడు దృఢానురక్తమతి నిందుముఖీ నిను నిశ్చయించునో
యెవనికినై శుభాంగి యసువులైన త్యజియింపఁగఁ దెంపుఁ జేసెదో

మల్లి—(తనలో) ప్రియసఖికంఠము మాఱిపోయినదేమి? (ప్రకాశముగా) ఆయన యెచ్చట నున్నాఁడు?

మారు—

వివిధవిషాదమారశరవిస్ఫుటభుజాంతరగాఢపీడితా
త్యవిరళపీవరస్తనత నాయెగఁ ద్వద్భుజపంజరంబునన్. 16

మల్లి—అమ్మో! మహాభాగుఁడే. (హర్షసాధ్వసలజ్జలతోఁ దొలఁగుచున్నది)

మారు—

తే. గీ. సాధ్వసంబునఁ దొలఁగకు చంచలాక్షి!
తగునె సంభ్రమకాతర వగుట దాస
జను గదఁ? చిరకాంక్షితోత్సవపుఁ గౌఁగి
టికిని భంగం బొనర్తు వదేల లతాంగి? 17

మల్లి—(వ్రీడాసూయలతో) సఖులారా! నేను బాగుగా వంచిత నయితిని.

కల—(త్వరగా సమీపించి) కల్యాణి! యాలాగున బలుకకుము.

మ. జగదుత్తంసుఁడు నావయస్యుఁ డకు భూపాలప్రాయుఁడై తీ వహా
సుగుణాఢ్యా! యెటు విప్రలబ్ధ యనఁ జొచ్చెన్ నిన్నుఁ? దన్నాత్మప్రాప్తిలో
భగవతీయోగమృగతృష్ణికం బడి యదభ్రభ్రాంతి వర్తించు దు
ర్భగుఁ డాడంబరకుండె నిన్ను పరికింపన్ విప్రలబ్ధుం డిటన్. 18

ఉ. చందనపాదపంబునకు సౌరభసంపదవోలె, జ్యోత్స్న పూ
ర్ణేందునకుం బలెన్, మణికి దృష్టియుఁ బోలెను శోభనాంగి! నీ
యందపుసొమ్ముగ న్మిత్రుని కవ్వియు వానికిఁ బోలె నీవు నీ
సుందరమూర్తిఁ జెప్పెదను జూడవె సమభ్యుదితానలంబమై. 19

భ్రమ—(సమీపించి) నవమాలికా! మన యదృష్టము మంచిది. ఒడయుఁడు నొడయురాలు నభ్యుదయమున వర్థిల్లుచున్నారు.

మందా—(పరిహృష్టవదన యయి ప్రవేశించి)

తే. గీ. సిరియుఁ బార్వతి, భారతి, సీత, భీమ
జాత, పౌలోమి, రుక్మిణి, సత్యభామ,
కృష్ణ, శర్మిష్ఠ, సావిత్రి, ధృతి నరుంధ
తీ రమసాధ్వి, యాశీర్వదింత్రు గాక. 20

(అంతటఁ జూచి సాశంకముగా) మల్లిక యీలతాభవనమునుండి యెక్కడికి వెళ్ళినదో! (లతాంతరముఁ జూచి యానందముతో) అహో! నామనోరథములు ఫలించినట్లే. ఇదిగో! మందారమూలమున మారుతుఁడు—

చ. అతిసుకుమారమూర్తి గృశమునై రమణీయతఁ గాంచు మేనితోఁ
బ్రతిపగుడు ప్రియుం జను సరి నచ్చెడురూపున లోభనీయుఁడై
చతురకటాక్షముల్ స్మరదురాగబలాత్కము ప్రేక్షనట్రు వా
వతులితమల్లికాముఖమునం దోలయించుచు నున్నవాఁ డిటన్. 21

(సమీపించుచు) నవమాలికా! యాలసించెదవేమి?

నవ—అహో! భగవతియే వచ్చినది. (ఎదురుపోయి) భగవతి! మేము మాలసించుట లేదు.

మల్లి—(సగద్గదముగా) భగవతీ! రక్షింపుము. రక్షింపుము. (అంజలిపట్టి పచ్చుచున్నది)

మందా—(మల్లికను కౌఁగిలించుకొని) బిడ్డా!

మ. సమరాగుండు మహాభిజన్ముఁడు జగత్ప్రఖ్యాతుఁ ప్రియుం డౌజనో
త్తముఁ డందున్ బృథరక్త వీవు; పొగ డొందం జాలుకల్యాణి! నీ
దుమనోవాంఛ ఫలించుఁ; బుణ్యసుముఖా దో నిన్నుఁ బెండ్లాడి, డెం
దముఁ గందించు చిరాంగజజ్వరము బాధం బాయుం నిం కీతఁడున్. 22

నవ—(ఆనందముతో) భగవతీ! సర్వోత్తర మయినతననిర్మాణవైదగ్ధ్యము చిరకాలమునకు సఫలమగుటచేత విధాత కృతార్థతను బొందుఁ గాక. శంబరకహంతకుని పరిణయప్రసంగముచేతఁ గలుగను లయి బంధుజనహృదయంబులు ప్రసన్నతనొందుఁ గాక. మాతాపితృసమానము లగువిహాహస్తములతోలనే మహాభాగునిచేతికిఁ బ్రియుఖిససర్పింపవలయును.

మల్లి—(తనలో) అయ్యో! వారు సర్వమంగళావచనప్రమాణలు గదా!

మందా—నవమాలికా! నే నిప్పుడు వేఱుగ నర్పింప వలసినదేమి?

తే గీ. చెక్కు చెమరింప ఖండంగ రక్కసీని। చేతియందుండి తిగిచి రక్షించి యీమె
ఘోరఖడ్గంబు మెడఁ బెట్టుకొన్నయితని। కరమునం దుంచె సర్వమంగళయె మున్ను.

మఱియు——

క. ఒండొరులయిచ్చ వగునీ। పెండిలియం దేల యీమెఁ బెద్దలొసఁగ ! నా
థుం డుపయింపఁగ రంజిలు। చుండుకలువ నెక్క రిచ్చిరో తొగచెలికిన్. 24

అయినను లోకాచారము జరిగించెదను. (మారుతుని గూర్చి) వత్స ! మారుత !
యిటురా.

మారు——భగవతీ ! యాజ్ఞాపింపుము.

మంద——

చ. వెలఁది, ప్రసిద్ధవంశభవుఁడు విశ్వావసు కూఁతుకీ గుణ్యస
కవితతవలి లచ్చి బలెఁ గానకి కాంతివపుఃశ్రీ; ధర్మముల్
సలుపఁగ రాఁగ పావకుఁడు సాక్షిగ, నే సుహృదుండనైననీ
కొలఁదిని నీవి శ్రేయము వహించెను బట్టిపించితివే వశో. 25

కల——మాపుణ్యసుకృతము ఫలించినది.

నవ——మాకులదేవతలు ప్రసన్నలయిరి.

కల——(హర్షముతో) భగవతి ! సర్వదా యనవద్యమయి యీసంబంధమును జూచి
హృదయము ప్రసన్నమగుచున్నది. చూడు——

ఆ వె. సహజనూతనాంగసౌందర్యసమున్నా। తైకరాశి కఖిలస్పృహకోర
కాంగకాంతి కీమె కిఖాభిజాత్యంబు। కనకకుసుమదామమునకుఁ దావి. 26

నవ——(మల్లికను జూచి నిశ్వాసముతోఁ దనలో) ప్రియసఖి మహాభాగునకు సర్వదా
వల్లభయిస్పృహే కాఁగలదా?

మంద——(పమస్కరించి కన్నీళ్లతో) వత్స ! మారుత !

మారు——(సాశంకముగా) భగవతీ ! యాజ్ఞాపింపుము.

మంద——

ఉ. ఒరు లెఱిఁగింపఁ దగ్గ దొకఁ డంత దెలుఁగుగు జ్ఞేయసారముల్
కొరవరి ! నైనఁ గేవలముఁ బ్రేముడినన్ బలికెంచు నియ్యెడన్

మారు——(వినయముతో వినుచున్నాఁడు)

మంద——(మల్లికచేయి పట్టుకొని)

తరుణి యి దేకపుత్రిసుమి తండ్రికి, బంధులకెల్లఁ బ్రాణ మీ
పొరసినస్నేహబంధ మెడ పొంపక యుండుత మీదు నీమెకోన్. 27

మారు-(సిగ్గుతో) అమ్మా ! నాన్నగారి యనుమతి వినఁ బుట్టెనితిపాశయము

పట్టుచున్నది.

కల—భగవతీ! యతిప్రసక్తమయిన మీయభ్యర్థనమునకుఁ దగినయుత్తరము నిత్తుని నిపత్తుమున నాకుఁదోఁచుచున్నది. మాధవుఁడు—

చ. స్థిరపడె స్నేహ మీమె కన, స్నిగ్ధునకున్ సకృతీశు నల్లె; క్రు
మ్మరు పలుకఁడై యటన్న, ననుమంచిత, మయ్యెను బ్రేమపాత్రుఁడై మున్;
సరళత ట్టెఁ డెవ్వఁ డన్, సౌహృదవాక్యము; యీమె కోసమై
సరకు నొనందు ప్రాణముఁ, సర్వము నీమె యె చూచె నానిసిక్. 28

మందా—(సవిమర్శముగా మల్లికను గూర్చి) పుత్రీ! నీకుఁ గూడ నించుక యుపదేశించెదను.

మల్లి—భగవతీ! యానతిమ్ము.

మందా—

ఉ. సేవల నత్తమామలకుఁ జేయు మెపప్పుడు మాఁదుబిడ్డలున్;
సేవకులం దయాంగినుము, స్నిగ్ధపుసమ్మత సత్తులం దతి
థ్యావళి సత్కరింపుము; గృహక్రియలంచును బట్టకింప క
మ్మా! వెయి చెప్పనేల? సుఖమందుము సల్పుముభర్త యిష్టమున్. 29

మల్లి—(సిగ్గుతో మనస్సున నంగీకరించుచున్నది)

నవ—ఇది యుచితమయినయుపదేశము.

మందా—వత్స! మారుత! తలఁచినవ్వాఁడు వచ్చెనని నిన్ను వీడుకొనినయాదివ్యపురుషుని మాకరందనామునిని, శంబరకహంతకవంచనార్థము మల్లికావేషమును దాల్చి దయచేయుమని యిప్పుడు సంస్మరింపుము.

మారు—(ధ్యానము నభినయించుచున్నాఁడు)

(తరువాత మల్లికావేషముతో మాకరందుఁడు ప్రవేశించుచున్నాఁడు)

మాకం—సఖా! మారుత! యిదిగో నేను వచ్చితిని. నీయభీష్టము నెఱవేర్చెదను.

(మందాకినీమారుతులు దక్క మిగిలినయందఱు విస్మయము నభినయించుచున్నారు)

కాళిం—(జనాంతికముగా) వనమాలికా! యీతఁడు మహాభాగునిచే రాక్షసబాధము నుండి విమోచితుఁ డయిన దివ్యపురుషుఁడు సుమా!

నవ—కాళిందీ! యాశ్చర్యమాశ్చర్యము! ఎవ్వఁడు ప్రియసఖిని భక్షించుటకు సిద్ధపడెనో యతఁడే యిప్పుడు రక్షించుటకు సిద్ధపడినాఁడు. [మల్లికతో] సఖీ! మాకు మఱియొక ప్రియసఖి యెట్లుగలిగెనదో చూచుము మాఁదు.

మారు—మహాపురుష! భగవతి నిన్ను మున్ను కోరినదాని నాచరింపుము.

మాకం—చక్కఁగా నాచరించెదను.

[కాషాయాంబరయుగళహస్తయయి సారసిక ప్రవేశించుచున్నది]

సార—భగవతి! యిది చపలకుండు తెచ్చినవస్త్రయుగ్మము.

మందా—వత్స! కలకంఠ! నీ పీతకాషాయయుగ్మముచే శోచనీయమయినను నావేషము ధరించుకొమ్ము. ఇది విషయోపభోగవిరుద్ధమే యయినను దీనిచేతనీవు దమయంతి కను బొందం గలవు. [అందఱు నవ్వుచున్నారు]

మారు—ఇదియు మనకు మంగళమే యనుకోవచ్చును.

కల—[చిఱునవ్వుతో వస్త్రయుగ్మము తీసికొని నిష్క్రమించి మందాకినీ వేషముతోఁ బ్రవేశించి] ఇదిగో! భగవతి నయితిని.

మారు—శంబరకుఁడు నీపాదములమీఁదఁ బడుఁగాక.

మందా—[కాళిందీనవమాలికలను జూచి] బిడ్డలారా! మీరిద్దఱుఁ గలకంఠునితోఁ గూడ నీమహాపురుషు ననుసరింపుఁడు.

ఇద్దఱు—చిత్తము భగవతి!

మాకం—[చిఱునవ్వుతో] భగవతి! శంబరకునిఁ బెండ్లియాడఁ బోవుచున్నాను.

మందా—వత్సా! ముందునీకుఁ జెప్పినమార్గమున నాయభిలషితము నెఱవేర్పుము.

మాకం—మిత్రుఁడా! రమ్ము కలకంఠ! మారుతునకు నేను నీవంటివాఁడనే సుమీ.

కల—మహాపురుష! మా కందఱకు నీవు పూజ్యతముఁడవు. పోదము రమ్ము. [కాళిందీనవమాలికలతో నిష్క్రమించుచున్నారు]

మల్లి—సఖులారా! నా కిక్కడ సాయ మెవరు?

నవ—[చిఱునవ్వుతో నించుక మరలి] ఇదిగో నీమహాభాగుఁడే.

మందా—భ్రమరక! నీవుకూడ గూఢముగా విష్ణురాతునింటికిఁ బోయి మధుకరిక చెప్పినట్లు కావింపుము.

భ్రమ—చిత్తము భగవతి! [నిష్క్రమించుచున్నాఁడు]

మందా—వత్స! మారుత! యిదిగో నిరుగడ దృఢముగా వెలుఁగు వేసి కాపాడఁబడెడు నీయుద్యానవీథి నాయాశ్రమము నంటి యున్నది. ఇక్కడ నంబికావర్ధనార్థముగు మల్లికకొఱకుఁ బుష్పాడియుసుకతోఁ జక్కనిదారి యొకటి యేర్పఱుపఁబడియున్నది. కాఁబట్టి మనమును బోవుదము. అస్మదాశ్రమోపశల్యభూములు రమణీయములు సుమీ అక్కడ—

ఉ. స్వైరపులీలలం దొసఁగు సౌఖ్యము మీకు నవాబ్ధిశంకమా
యోదకమారనృత్య సమయోచితనిస్వనశబ్దసత్త్వమా
త్రోత్థితమోనిగూఢములు నుచ్చమరీచకిసాలశాఖికా
స్వాదుచకోరికానయన శారము లాపికభుక్తచూతమున్. 30

సూత్రి. సూ——

ఉ. అలసినఁ గిరీశులన్ నవలతాంతవితానలతాగృహంబులం
గొలఁగొనుచు మెల్లమెల్లనిమ నోపకతో భజియించు నూత్నని
ష్కలితబహుప్రసూనమకరంద నిమగ్నసముత్థితంబు లౌ
కలకలహంసగాన సుముఖంబులు సోమపరస్పమోదముల్. 31

[అందఱు నిష్క్రమించుచున్నారు)




ఇది శ్రీమహేశ్వరప్రసాదలబ్ధసరసకవితాధురంధర వద్దాదిసాధుజనానందసంధాయ
కామాత్యకాచ్చనామాత్యపౌత్ర హరితసగోత్ర పవిత్రగుణకదంబతిమ్మరాజాత్మజ
శాస్త్రముక్తాఫల సూరపరాజప్రధాన తనూభవ విబుధవిధేయ సుబ్బరాయనామధే
యాంధ్రీకృత మల్లికామారుతప్రకరణమునందు షష్ఠాంకము.

సమాప్తము.



# సరస్వతీకార్యస్థానమున వెలకుదొరకు పుస్తకములు.

---

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | మాలతీమాధవీయము ... | రు. ... | 0 | 8 | 0 |
| 2. | రాయనభాస్కరమంత్రిచరిత్రము ... | ... | 0 | 4 | 0 |
| 3. | శ్రీరామేశ్వరయాత్రాచరిత్రము ... | ... | 0 | 8 | 0 |
| 4. | మార్కండేయపురాణము ఎఫ్. ఏ టెక్స్టు 1903 04 | ... | 1 | 4 | 0 |
| 5. | శకుంతలాపరిణయము ... | ... | 0 | 8 | 0 |
| 6. | హిందూగృహము ... | ... | 0 | 1 | 0 |
| 7. | మనుష్యవాంఛానిష్ప్రయోజనత్వము ... | ... | 0 | 1 | 0 |
| 8. | నేలబొగ్గు ... | ... | 0 | 1 | 0 |
| 9. | భువనమోహిని ... | ... | 0 | 4 | 0 |
| 10. | మిల్లరుదొరవారిజీవితము ... | ... | 0 | 1 | 0 |
| 11. | అపవాదతరంగిణి ... | ... | 0 | 6 | 0 |
| | డిటో సరస్వతీచందాదారులకు | ... | 0 | 4 | 0 |
| 12. | విజయవిలాసము ... | ... | 0 | 6 | 0 |
| 13. | కాటన్‌దొరగారిచరిత్రము ... | ... | 0 | 1 | 0 |
| 14. | మాతృపటము (ఇంగ్లీషులో) ... | ... | 0 | 1 | 0 |
| 15. | సన్న్యాసక్షేత్రాదికచారిత్రము ... | ... | 0 | 8 | 0 |
| 16. | నిరంకుశోపాఖ్యానము ... ... | .... | 0 | 6 | 0 |
| 17. | హరివిలాసము ... ... | ... | 0 | 8 | 0 |
| 18. | బాలరామాయణము (ప్రథమభాగము) | ... | 0 | 8 | 0 |
| 19. | సౌందర్యతిలక, (నోవలు రెండుభాగములుకలది) | ... | 0 | 14 | 0 |
| 20. | శ్రీమత్పరమహంసరామకృష్ణులు ... | ... | 0 | 5 | 0 |
| 21. | కేయూరబాహుచరిత్రము ... | ... | 0 | 6 | 0 |
| 22. | సంస్కృతనాటకకథాసారము ... | ... | 0 | 12 | 0 |
| 23. | హోశింత్రాయి ... | ... | 0 | 10 | 0 |
| 24. | రాజతరంగిణి (ప్రథమభాగము) ... | ... | 0 | 8 | 0 |
| 25. | బుద్ధచరిత్రము ... | ... | 0 | 10 | 0 |
| 26. | శ్రీశివాజీచరిత్రము .. | ... | 0 | 10 | 0 |

గ్రంథములు కోరువారు సరస్వతీమేనేజరుగారికి కాకినాడ వ్రాసి వి. పి. గానైనను పోస్టుస్టాంపులైనను పంపి తెప్పించుకొనవచ్చును.